

శ్రీ

# ప్రబోధిని.


శ్రీ కృష్ణా, గుంటూరుమండల విశ్వబ్రాహ్మణ
సమాజ పక్షమున ప్రకటింపఁబడు మాసపత్రిక.

ఇందు నీతి,మత,సంస్కరణ,భాషా, శిల్పవిషయములు చర్చింపఁబడును.

సంపుటము. 7. | గుంటూరుజిల్లా,దుగ్గిరాల, జూన్ 1915. | సంచిక. 6.


## ప్రేమ.

ఇది ప్రపంచతత్వమును మిగుల లాఘవముతో నడపు మనోహరమగు శక్తి. దీనినిగుఱించి విచారించుటయు మనోహరముగనే యుండును.

మనశరీరము నాభిమొదలు క్రిందికిని మీదునకును రెండుభాగములుచేసి నాభి కూర్మాకారముగ నుండుననియు, దానిసిరస్సు పురుషున కెడమవైపునకును స్త్రీకి కుడివైపునకును, తిరిగియుండుననియు, దానిక్రిందిపాదములయందలి నాడులు మీదునకును, పైపాదములయందలినాడులుక్రిందునకు, శరీర మంతటను వ్యాపించుననియు, రోమములు ఈనాడులయొక్క కొనలనియు, రక్తము సర్వదా నాడులయందే ప్రవహించుచుండుననియు, శుశృతాచార్యుఁడు నుడివియున్నాఁడు. రక్తమునుగుఱించి వివరించునపుడు జీవులయొక్క ప్రాణి రక్తము

నందే స్థాపింపఁబడియున్నదని వాగ్భటాచార్యుఁడు నుడివియున్నాఁడు. ఇటీవల కొందరు యూనానీపండితులు 'రక్తముయొక్క సారమునుండి మీదుకువ్యాపించు ఆవిరికే ఆత్మయనిపేరు' అని నుడివియున్నారు. సమస్త కార్యములను మనోబలముచే జేయు యోగాభ్యాసమునకు ప్రేమను తగ్గించవలెను గావున సర్వాంగములయందలి రోమములను విచ్చలవిడి పెరుగనియ్యవలయునని మునుల భావము. తల వెండ్రుకలు మాసియున్నయెడల కులకాంతలు సైతము రోయుదురని సితిశాస్త్రజ్ఞులు నుడివియున్నారు. వీటినన్నింటిని పోల్చిచూడ రక్తముయొక్క ఆవిరి రోమకూపములనుండి వెలికివ్యాపించివాయువులోగలసి పరస్పర మాకర్షించుటవలన ప్రేమకల్గునని తెలియుచున్నది. దీని ననేకయుదాహరణలతోఁ బోల్చిచూతము. వాతములనుష్ణశీతలక్షణములవలన వేర్వేఱు నామములను పొందినటుల ప్రేమయును అనుష్ఠానభేదమువలన వేర్వేఱు నామములను పొందును. అభిమానము, భక్తి, వాత్సల్యము, దయ, మోహము మున్నగునవి ప్రేమయొక్క రూపములే. శిశువు మాతృశరీరమునుండి వెలికివచ్చినకొలది కాలములోనే రక్తముయొక్క ఆకర్షణవలన ఎవరు తల్లియైనది ఎవరుకానిది గ్రహింపఁగలదు. పాలిచ్చుటతోడ పనిలేకయే శిశువు ఇతరులచేతులలో నుండునపుడేడ్చుటయు, తల్లి చేతులలోనుండునపుడూరడిల్లుటయు సంభవించునుగదా! ఇందుకు కారణము తల్లిశరీరమునందలి రక్తము బిడ్డశరీరమునందలి రక్తము నాకర్షించుటయే. దేహాత్మలచేత తాను పరిశుద్ధుఁడై మంచిమనస్సుతో మనోబలమువలన వ్యాధులను నివర్తింపఁజేయు మంత్రశాస్త్రజ్ఞులు హస్తసంచాలనము చేయవలయునని చెప్పఁబడెనుగదా! అందువలన నెదుటనుండువారి శక్తులు మనచే నాకర్షింపఁబడును. బిడ్డలకు మనము చేతులను చాచిచూపి, రమ్మనిపిలచి, తలనూగించి, మంచిచూపులు చూచి చేతుల నాడింతుము. ఇది హస్తసంచాలనము. ఇది గొప్ప సమ్మోహనవిద్య. ఇందువలన బిడ్డలు తప్పక మన చేతులలోనికి వత్తురు. తరువాత మనము బిడ్డలను చూచి, 'ప్రియమైన కుమారీ, ముద్దుబిడ్డా, చిన్నితల్లీ!' అనువాక్యములతో నింగుల గారవించుచు ముద్దుబెట్టుకొనెదము. ఇందువలన బిడ్డల మనశ్శక్తి వృద్ధిపొందును. నిజముగా బిడ్డలయెడల ప్రేమగలవారు బిడ్డల నెంతమాత్రము తిట్టరాదు. బిడ్డలచేతఁ జేయించవలసిన సమస్తకార్యముల

నుపదేశమువలననే తెలుపవలయును. కొందఱు సాధారణముగా పెంకెతనముగల బిడ్డలను మంచిమాటలచే పనులు చేయింపఁజాలక తిట్టుదురు. అందువలన తప్పక నాయుఃక్షీణము, పిరికితనము తేజోభంగము, సంభవించును. శిశుపురెయ్యొద్దకుబోయి చెవులయొద్ద రెండు ఱాళ్లతో కొట్టి టిక్కు టిక్కుమని ధ్వని చేసి, 'ఒక శరీరమువలన వేఱొక శరీర మేర్పడుచున్నది. తానే పుత్రుఁడగుచున్నాడు. సర్వమును హృదయముచేతనే సంభవించుచున్నది. దీర్ఘాయుష్మవంతుఁడవుగమ్ము' అను భావముగల మంత్రము నుపదేశింపవలయునని వాగ్భటాచార్యుఁడు నుడివియున్నాఁడు. జాతకర్మము మొదలు చేయు సమస్తకర్మములు బిడ్డల తేజస్సు, ఓజస్సు, బుద్ధి, పరాక్రమము, మనస్సు, ఆయుస్సు, వృద్ధిపొందుటకు తల్లిదండ్రులు ప్రేమతో చేయు నుపదేశములుగా నెంచఁబడుచున్నవి. ఆశీర్వాదమువలన నాయుర్వృద్ధి కలుగునని నమ్మినంతవఱకు తిట్టుటవలన నాయుఃక్షీణము కలుగునని నిశ్చయముగ నమ్మవలయును. కావున శిశుపోషణకు ప్రేమ ముఖ్యాధారమని చెప్పవచ్చును. పశువులు దూడలను నాకుటయు కోతి పిల్లను పొట్టకు గట్టుకొని తిరుగుటయు, పిల్లి పిల్లలయొక్క మెడను పట్టుకొని తిరుగుటయు, మనము చూచుచున్నారము. ఇవి యా జంతువుల జ్ఞానమని చెప్పవచ్చునా? కాదు. ఉభయశరీరములయందలి రక్తముయొక్క ఆకర్షణశక్తియే.

మనపూర్వుల యభిప్రాయమును జూడ ప్రతివానికిని బాల్యమున వైరాగ్యమును నేర్పి పిమ్మట ప్రేమను నేర్పుదురని తెలియుచున్నది. బ్రహ్మచర్యవ్రతమున దీక్షాబద్ధుఁడైయున్నవానికి భార్యానాసక్తి ప్రేమను నేర్పుదురు. ప్రార్థనయందే 'లక్ష్మీదేవిని తొడపై కూర్చుండఁబెట్టుకొని సరసాలాపము లాడుచున్న విష్ణుదేవునకు వందనమాచరించుచున్నాఁడను' అని చెప్పుదురు. ఈశ్వరుఁ డర్ధనారి యనియు, అతనినే ధ్యానింపవలయుననియు చెప్పుదురు. దేవతాప్రతిష్ఠాపనలు, కల్యాణమహోత్సవములు, మున్నగువానిని దంపతులవిగ్రహములతోడనే చేయుదురు. ఈశ్వరుఁడు భార్యను శిరమునందును, విష్ణు హృదయమునందును, బ్రహ్మ వాక్కునందును నుంచుకొనునని చెప్పి ఆ భావముల ననేకవిగ్రహములతో బ్రద

ర్పింతురు. దంపతులొకచోటనిలిచియుండునపుడు వారిమధ్యగా నితరులుపోగూడదని చెప్పుదురు. అనగా వధూవరులు కడు సమీపముననుండవలయునని తెలియుచున్నది, కొంచె మెడముగానున్న వధూవరులను చూచినవాడుదూరముననిలిచి తానుపోవుటకు దారిలేదనిచెప్పుచు ఎడముగానున్న దంపతులను సమీపమునకుఁజేర్చి వారిప్రేమను వృద్ధిపఱచినవాఁ డగును. వధూవరులిచ్చు తాంబూలములనుగ్రహించుటకును, వధూవరులను నాశీర్వదించుటకును, దంపతులొకరిసారిగా రావలయునందురు. మదరాసు మున్నగు ప్రాంతములవారు వివాహములో వధూవరులచే దోసిలిలో ముమ్మారు తలంబ్రాలుపోయించికూర్చుండబెట్టి బంధువులు, మిత్రులు, వీరు వారనక నందఱును దంపతులుగావచ్చి వధూవరుల సిరముపై మూఁడుదోసెళ్లు తలంబ్రాలుపోయునటులఁ జేయుదురు. నూత్న దంపతుల సమీపమునఁజేయు సమస్తకార్యములును, యుపదేశములును, ప్రేమాయుతములుగా నుండును. ఇదియంతయును దంపతులప్రేమను వృద్ధిచేయుటగాని వేఱుగాదు. బ్రహ్మచర్యముననత్యంతదీక్షాబద్ధులై మెలఁగువారు దాంపత్యమున మిగుల ప్రేమానురాగము కలిగి యుందురు. దంపతులప్రేమ నవృష్టిచేయుటకై గార్హస్థ్యధర్మమును బోధించుటకంటె బ్రహ్మచర్యధర్మమును గఱించి బోధించుట ముఖ్యము. దాంపత్యధర్మమంతయు ప్రేమచేతనే నడచును కలియుగమున దాంపత్యధర్మముకూడ నొకరిపాదముమీదనే నడచుచున్నది 'భార్యాహత భర్త్రికపాలభిన్నమ్' అనువాక్యములుచాలవఱకు దాంపత్యధర్మమును జెఱచినవి. తల్లి, తండ్రి, సోదరుఁడు, మున్నగువారికంటె భార్యనత్యంతప్రేమగా జూచుట ముఖ్యము. పతియేదైవము. ఆతనిపదసేవయే మోక్షమార్గము. ఆతనిసుస్నేహము పరమాన్నము. ఆతనిసౌఖ్యమే నాసౌఖ్యము. అతఁడు మరణించినచో సహగమనమే నాకుశరణ్యము. అను ధర్మములతో వర్తించుభార్య నన్యులకంటె నధికప్రేమగా జూడవలయుననుట విపరీతముదు. దంపతులు పరస్పరప్రేమానురాగవాస్తవముగలోతును కనుగొనదగియుక్తిశాస్త్రములుగలవారుగా నుండవలయును. షాజహాన్ సద్గుర్తనుఁడును, నయశీలుఁడును, రాచకార్యధురంధరుఁడును, ననుట సుప్రసిద్ధము. అతఁడు నభార్య ముంతాజియందుగల ప్రేమాతిశయముచే నంతఃపురమునసుండిఒకప్పు

రాచకార్యములను విచారించుటమానినందున మంత్రులు దంపతుల ప్రేమను విరుగఁగొట్ట ప్రయత్నించిరి. వారి యభిప్రాయానుగుణ్యముగ నొక సుందరి యంతఃపురమున బ్రవేశించియు నవాబుగారి ప్రేమకు పాత్రురాలు గాదయ్యెను. 'నేను నా భార్యయెడల జూపవలసిన ప్రేమను ఇతరులయెడలఁ జూపఁజాలను. తడవుచేసి నన్ను స్త్రీహత్యజేసినవానినిగా జేయకుము.' అని వంపివేయఁబడెను. తరువాత నాయువతి రాణియొద్దకు పిలువబడి శిక్షింపఁబడుటకుమారుగా సన్మానింపఁబడెను. 'నీవు నాకు మహోపకారము చేసితివి. నా భర్తగారికి నాయెడలగల ప్రేమయొక్క వాస్తవముగు లోతును నీవలననే కనుగొంటిని' అని రాణిచెప్పెను. ఇట్టి రసవంతమగు శోధనలవలన దంపతులప్రేమ వృద్ధి నొందును.

ప్రేమ విచారమును బుట్టించును. విచారమువలనను వియోగమువలనను ప్రేమ వృద్ధిజెందును. మనమొక చిలుకనుగాని మఱియేజంతువునుగాని పెంచినప్పుడు మనశరీరమునందలి శక్తులు వానియందువ్యాపించి వానిశక్తులనాకర్షించును. అందువలన నవి వశపడుటయేగాక వానియందు మనకు ప్రేమజనించును. బిడ్డలు, మిత్రులు, మున్నగువారియెడల ప్రేమకూడ నిట్టిదే. మనమొక ప్రదేశమున నివసించునప్పుడా ప్రదేశమున మనశరీరమునందలి రక్తముయొక్క శక్తులువ్యాపించి ప్రతిఫలించును. కావుననే బిడ్డలను, మిత్రులను, పెంపుడుజంతువులను ప్రదేశమును మనము విడువజాలము. విడువవలసినచో విచారముపుట్టి వానియెడలగల ప్రేమ పూర్వముకంటె వృద్ధియగును. తాను ప్రేమింపవలసినవానిని సర్వదా సమీపమునను ంచుకొనుటకంటె యొకదూరమునను ంచి మధ్యమధ్య సమీపమునకు దెచ్చుకొనుట హితకరమందురు. అందువలన ప్రేమవృద్ధియగును.

ప్రేమ యనుమానమును బుట్టించును. దానిసత్యమును గ్రహించినచో ఆ ప్రేమ వృద్ధిఁజెందును. దీనిని కొన్ని యుదాహరణలతో బరిశీలింతము. ఒక రాజు గర్భవతియగుభార్యనువిడచి మఱల పదునైదుసంవత్సరములకు వచ్చినప్పటి కామె కుమారుని ప్రక్కలో పరుండబెట్టుకొని నిద్రించుచుండెను. రాజు

వమానముఁ జెంది కత్తి దూసెను. పిదప వాస్తవము గ్రహించగా భార్యయెడల గల ప్రేమ వృద్ధియయ్యెను. ఒక మంత్రి తన రాజు రాణీలను తల్లిదండ్రులవలె చూచుట యలవాటు. ఒకనాఁడు రాజు మంత్రియు నొక వృక్షముక్రింద నిద్రించుచుండ వృక్షాగ్రముననుండు పక్షిదంపతు లిట్లు ప్రసంగించెను. 'నేటిరాత్రి ఈ రాజు భార్యతోడ నిద్రించుచుండ నొక కృష్ణసర్పము వచ్చి రాణియొక్క వక్షస్థలమున విషము గ్రక్కును. అందువలన తొలుత రాజునకును పిదప రాణికిని మరణము సంభవించును. ఎవ్వరైనను గ్రహించి నిద్రాభంగము గావింపక విషమును నాలుకతో నాకి వేసినయెడల మరణము తప్పును. కాని ఈ సంభాషణ వినినవారు రెండవవారికిఁ దెలిపినయెడల తలబగిలి మరణింతురు.' ఈ వాక్యము వినిన మంత్రి అంతఃపురమున డాగియుండి విషమును నాకి తీసివేయుచుండెను. రాజు మేల్కాంచి మిగుల ననుమానముఁ జెందెను. తుదకు సత్యమిదియని గ్రహించి మంత్రిని మిగుల క్షేమించి అతని మరణమునకు దుఃఖింపవలసినవాఁడయ్యెను.

ఇది కలియుగము. ఈ కాలమున నిజము నుగ్గొందుట యసాధ్యము. అక్కాయని పిలుచువారును, తల్లియని పిలుచువారును, బిడ్డాయని పిలుచువారును. విపరీతమార్గములనడచుచున్నారు. చూచుటకు క్రూరులుగాఁ గనఁబడువారును సాధువులుగాఁ గనఁబడువారును క్రూరకార్యములను చేయుచున్నారు. వారి ప్రేమయును నక్రమమైనదే. న్యాయమైన ప్రేమగలవారరుదుగా గలరు. వారల్లు కాంతలను తల్లులవలెను సోదరీమణులుగను బిడ్డలుగను చూతురు. అందు సుగుణములు యోగ్యతయునుగల బాలికలను కన్నబిడ్డలకంటె నినుమిక్కిలిగ గౌరవించి ప్రేమింతురు. ఈ మనుకారయునందలి సత్యమును గ్రహింపఁజాలనివారు శంకాన్వితస్వాంతులై కుందుదురు. సత్యమును గ్రహించినవారు పరమానందభరితులగుదురు.

మొత్తముమీఁద ప్రేమకంటె విలువగలది వేఱొండు లేదు. ఈశ్వరభక్తియొక్క రూపాంతరమగు వాస్తవమగు ప్రేమగలవారే మోక్షమునకర్హులు. మిత్రులారా! సంఘాభివృద్ధికై పరస్పరము ప్రేమగలిగి యుండవలయును.

# స్త్రీ విద్య.

బ్రహ్మశ్రీ అత్తలూరి పున్నయ్యగారి కుమార్తెల వివాహములో

సౌ॥ పులివర్తి ఈశ్వరమ్మచే నుడువఁబడినది.

విద్యయన నేమి? అది స్త్రీలకేలయుగత్యము? దాని నభివృద్ధిచేయు మార్గములెవ్వి? అనునవి ముఖ్యాంశములు.

ప్రపంచమునందనేక విధములగు జీవరాసులుగలవు. అవియన్నియు, గుఱ్ఱుమని ధ్వనిజేసియు కన్నులఁద్రిప్పియు తోఁక మీసములు మున్నగువానినిం గదలించియు, పరస్పరాభిప్రాయములను గ్రహించుచుండును. మనుజులు తమ యభిప్రాయముల నితరులకు మాటలమూలమునం దెలుపుదురు. సమస్త కళేబరములు రక్తమాంసములతో నిర్మింపబడియున్నను మానవశరీరమునందు మేధస్సును మజ్జాతంతువులును, అధికముగానుండుటవలన మనుజులకు జ్ఞానమధికముగానుండును. కావుననే నరజన్మముత్తమమనెదరు. జ్ఞానమువలన మనుజులు తమ యభిప్రాయముల నక్షరములతోఁబోల్చి ఈయుచ్చారణకీ యక్షరమని నిశ్చయించిరి. అభిప్రాయముల నక్షరములతో వ్రాయుటవలన మృగములవలె దగ్గరనున్నవారికిమాత్రముగాక దూరముననున్నవారికి వ్రాసి పంపి తెలుపుదురు. వ్రాయుటయు చదువుటయు విద్యయనఁబడును. వ్రాయుటయు చదువుటయు ప్రపంచమున నొకప్పుడు లేవనియు ఎట్టిమహత్తరములగు ధర్మములనుసైతము ఒకరివలనవిని మఱియొకరికి జెప్పుచుందురనియు, శ్రుతులవలన దెలియుచున్నది. వ్రాయను, చదువను నేరక తాతతండ్రుల యనుభవ సాంప్రదాయములవలనం గ్రహించినవానికంటె వ్రాయను చదువను నేర్చినవాఁడు గ్రంథాదులవలన విశేషాంశములను గ్రహించగలఁడు కావున విద్యవలన జ్ఞానమును విద్యాభివృద్ధివలన జ్ఞానాభివృద్ధియు కలుగుననని తెలియుచున్నది.

విద్యవలన వినయాదిసుగుణములేర్పడుననుటయు విద్య యిహపరసౌఖ్యములకు సాధనమనుటయు సుప్రసిద్ధమేగదా. ఇది పురుషుల కగత్యమనియు స్త్రీల కనగత్యమనియు జెప్పుట కెట్లుసాధ్యమగును? స్త్రీపురుషులకు భేదమేమి? మనుష్యులకు జరామరణము లవిలంఘనీయములు. సృష్టిచిత్ర మొకనాటకరంగము. సూత్రధారుడగు సృష్టికర్త తన నాటకరంగము నెల్లప్పుడును మనోహరమగు నాటకపాత్రములతో నలంకరించి వినోదమునొందుచుండును గావున ప్రజావృద్ధిచేయుట ఈశ్వరసమ్మతము. ప్రజావృద్ధిచేయుటలో స్త్రీ పురుషులు సమానముగాని భేదముండదు. స్త్రీపురుషులు సంసారశకటమునకు రెండుచక్రములు. సృష్టికర్తకు రెండునేత్రములు. సుశ్రుతాచార్యుడు మున్నగు శారీరశాస్త్రజ్ఞులగు మునులు స్త్రీపురుషశరీరములయందు సర్వశక్తులు సమానముగానుండుననియు, పురుషశరీరమునందు త్రిగుణాత్మకమగుమహత్తు ఒకింతయధికముగానుండుననియు వ్రాసియున్నారు. కొందఱు నీతిశాస్త్రజ్ఞులు పురుషులకంటె స్త్రీలకు బుద్ధిబలము నాల్గంతలధికముగా నుండునని వ్రాసియున్నారు మొత్తముమీద ధర్మార్థకామములను జయించుటయందిరువురు సమానమని ప్రాజ్ఞులగువారు అనేకులు నుడివియున్నారు. గావున నిహపరసౌఖ్యములకు విద్య స్త్రీలకగత్యమని వేఱుగా జెప్పనక్కఱలేదు.

స్త్రీలకుగల కర్తవ్యములను విచారించినయెడల వారికిగల విద్యయొక్కఆవశ్యకత తేటపడగలదు. స్త్రీ పురుషున కర్ధాంగియై సమస్త కార్యములయందును పురుషునకు చేదోడువాదోడుగా నుండవలెననుటయేగాక ఇంటిపనులయందు దాసివలెను ఆలోచనచెప్పుటయందు మంత్రివలెను ఓర్పునందుభూమివలెను కుడుపునందు తల్లివలెను భార్య భర్తకు తోడ్పడవలయును. అదియే యుత్తమాంగనలక్షణము. అని నీతిశాస్త్రజ్ఞులు నుడివియున్నారు. అందువలన స్త్రీల కర్థశాస్త్రము పాకశాస్త్రము మున్నగునవి నిర్బంధవిద్యగా నుండవలయునని తెలియుచున్నది. శిశుపోషణభారమంతయు స్త్రీలపైనుండును గదా? అపుడుజనించినశిశువున కెట్లుపచారము చేయవలయును? ఎన్నినెలలశిశువునకు రోజున కెన్నిసార్లు పాలుపోయవలయును? పోతపాలుపోయవలసినప్పుడు ఏయేపదార్థ మెంతకలుపవలయును? ఒకసంవత్సరమువరకు శిశువున

కెన్నిసార్లు పాలు ఇవ్వవలయును? ఎన్నిదుస్తులు కావలయును? అను విషయములు వైద్యశాస్త్రపరిచయములేక నెట్లుతెలిసికొననగును? బిడ్డలకు విద్యాబుద్ధులుగఱపుభారముకూడ తల్లులమీదనేనుండును. విదేశీయులు రొట్టెలపై నక్షరములనువ్రాసి బిడ్డలకాహారముతోపాటు నక్షరజ్ఞానము నొసగుచుందురు. సాధారణముగా బిడ్డలకు ప్రారంభవిద్య తల్లులేనేర్పి పాఠశాలలకుబంపుదురు. ఇట్టియోగ్యత ప్రస్తుతము విదేశీయులయందున్నదనుట విపరీతముగాదు. పూర్వకాలమున హిందూస్త్రీలకు యిట్టిసామర్థ్యము వేయింతలుకలదని నిస్సంశయముగ జెప్పవచ్చును. దేవతలు తమకుగలిగిన సంశయములను పార్వతీదేవి వలన నివర్తించుకొనెదరని మనపురాణములు నుడువుచున్నవి. విద్యావతిగర్భమున జన్మించుటవలననే షణ్ముఖుడక్షరాభ్యాసమునందే విధాతకెదురుచెప్ప దొడగెనని నమ్మవచ్చును. దేహము గేహమువంటిది. గేహమును దీపముతోడను, దేహమును విద్యతోడను ప్రకాశింపజేయవచ్చును. పరిశుద్ధమగు ముత్యములు ముత్యపుచిప్పలయందే జన్మించునుగాని నత్తగుల్లలయందు జనింపనేరవు. విద్యాజ్ఞానమువలననే మనుజులకోశము పరిశుద్ధముగానుండును. స్త్రీలు విద్వాంసులుగానున్నచో వారిహృదయము జ్ఞానముతోడను, దయతోడను మంచియూహలతోడను నిండియుండును. కావున బిడ్డలు మిగుల తేజస్సు బుద్ధివికాసముగలవారుగా నుందురు. ఇవియన్నియు ఉన్నతవిద్యవలన గలుగులాభములు. సాధారణవిద్యవలన వెచ్చము, బట్టలు మున్నగులెక్కలు వ్రాయుట. బంధుమిత్రుల కుత్తర ప్రత్యుత్తరములు జఱుపుటవలన పురుషులకుతోడ్పడవచ్చును. ఇంక ననేకప్రయోజనములుకలవు. కాని కొందరు విద్యనేర్చిన స్త్రీలుద్యోగము చేతురా యూళ్లేలుదురా యని నిరుత్సాహపఱచుచున్నారు. ప్రస్తుతము బాల్యదశలోనున్న స్త్రీవిద్యకివి గొప్పగండములు. విద్య తేజోవంతమగు అగ్నివంటిది, అగ్నిచే నాహారపదార్థములను పచనముచేయవచ్చును ఇంటినితగులబెట్టవచ్చును. బుద్ధివంతుడేకార్యమును చేయును? బిడ్డలు నడువనేర్చిన నూతబడుదురనితలంచుటయు, స్త్రీలకు విద్య అనర్థదాయకమనుటయు సమమే. ఒకప్పుడు స్త్రీవిద్యాభిమానులు గూడ విసుగుజెంది స్త్రీలకు విద్య యనగత్యమని వాదించుటట సంభవించుచుండును "కాలి

కలవిద్యాను వ్యాప్తిజేసి మనదేశమునంగల వరకట్నములను మాన్పగలరా? బాలిక విద్యావతియని, సద్గుణఖనియని, కలిమిలేములు విచారింపక కట్నకానుకలు లేకుండ శ్రీమంతులుకోడలుగా స్వీకరింతురా? విద్యావినయములు పరిశీలించి వివాహములు చేయుట మనసర్గమున లభించునా? బాలురవిద్య నభివృద్ధిచేయక మూర్ఖులుగానుంచి వారికి విద్యావతినిచ్చి సంతసింతురా?" అని హింసాసుందరిలో నొక కన్యయువతి తనసోదరులకు నుడివియున్నది. స్త్రీవిద్యకూడదు అనువారిలో కొందరి భావమిదియే. విద్యలేనివారికి స్వాతంత్ర్యముండజాలదు. విద్యాస్వాతంత్ర్యములను గోల్పోయియున్న మనదేశమున నెట్లున్నను ఏ దేశమున కాంత లుద్యోగములు చేయుటలేదా? పురములను పాలింపకున్నను ధర్మములను పాలింపవలయును గదా? ఇంక ననేకప్రయోజనములు కలవు. వానినన్నింటిని వివరించుటకంటె విద్యనభివృద్ధిచేయుమార్గములను గమనించుట మేలు.

ప్రతిగ్రామమునందును బాలికాపాఠశాల లుండవలయును. ప్రస్తుతమావన్నికై దేశీయులకంటె దొరతనమువారెక్కువకృషిని జేయుచున్నారు. పాఠశాలలయభివృద్ధికై శ్రీ జార్జిసార్వభౌముండు పట్టాభిషేకకాలమున ఏబది లక్షలరూపాయల నొసంగియున్నాడు. కీర్తిశేషులగు గోకలేగారు నిర్బంధశాసనమును కల్పించియున్నారు. ఇది మిగులయుక్తమైనది. 'నయమున బాలుంద్రావరు భయమున విషమైనగాని భక్షింతురు' అనునటుల నిర్బంధమువలన నన్నికార్యములు నెఱవేఱును. నిర్బంధశాసనమును ఆచరణలోనికి దెచ్చుటముఖ్యము. బాలికలు బడికిబోవుటకును ఉన్నతవిద్యనభ్యసించుటకును, ఇంటిపనులయందు కొంతయవకాశముండవలయును. లేనిచో నెక్కువవిద్య లభింపనేరదు. ఈవిషయమున తల్లిదండ్రులును, అత్తమామలును భర్తలును దయగలవారుగా నుండవలయును. ఈమధ్య మెట్రిక్యులేషన్ చదువుచున్న నొక స్త్రీ 'నీకు పసిబిడ్డకలదుగదా నీవు పాఠశాలకెట్లుపోదువ' ని ప్రశ్నింపబడినప్పుడు నాయత్తగారు మిగులమంచిది. నేను పాఠశాలకుబోయివచ్చువరకును బిడ్డను చూచుచుండును. అని ప్రత్యుత్తరముచెప్పెను. ఇంతమాత్రమున యింటిపనులు చేయుటలో స్త్రీలు సోమరులుగా నుండవలెననుటగాదు. మనలో సాధా

రణముగా బాలికలు పండ్రెండు పదమూడు సంవత్సరములకు పుష్పవతులగుదురు. ఉష్ణాధికతచే కొందరు పది తొమ్మిది సంవత్సరములకే పుష్పవతులగుదురు. అంతమాత్రమున పాఠశాల మానవలసినదేకదా! నిజముగా పది పండ్రెండు సంవత్సరముల వయస్సుగల బాలురు అక్షరములను సరిగా వ్రాయజాలనివారుగానుండ అంతేవయస్సుగల బాలికలు విద్యలనన్నిటిని బూర్తిచేయుదురా? పుష్పవతులైనను బాలికలను బడికి పంపవలయును. లేనిచో బాలికలకు విద్య లభించనేరదు. బాలికలను బిడ్డలుగా భావించు నుపాధ్యాయుడుండవలయును. వయసువచ్చినకన్యలకు స్త్రీలుపాధ్యాయినులుగానుండుట మేలు. విదేశీయులు చిన్నతరగతి బాలురకు సైతము స్త్రీల నుపాధ్యాయినులనుగా నుంతురు. పూనా మున్నగు ప్రాంతములందు పుష్పవతులైన బాలికలు మాత్రముగాక బిడ్డతల్లులునూ బడికిపోవుచుందురు. డాక్టరు కీమూరాగారి యుపన్యాసమువలన జపాన్ దేశమున వైద్యశాస్త్రము, పాకశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము మొన్నగువానియందు జయమొందని బాలికలు వివాహయోగ్యురాండ్రు గారని తెలియుచున్నది. మనవారంగవిహీనులకు సైతము వివాహముచేయుచుండుట కడు శోచనీయము. "నీకేమియును చేతగాదు పశువులను గాయుదువా?" యనెదరు. "ఇంతపెద్దగ్రంథమును బాగుగా జదివినగాని పశువులను గాయజాలవు" అని పశుశాస్త్రమునందు వ్రాయబడినటుల విద్యలేనికన్య వివాహయోగ్యురాలు కాదను జపానుదేశాచారము స్త్రీవిద్యను మిగుల ప్రోత్సహించుచున్నది. కొట్టుదురన్న భయమును, పెట్టుదురన్న నాశయు పొడముట సహజము. అన్నిటికి బహుమతులనిచ్చుచున్నారు. నరసాపురి తాలూకాభివృద్ధిసంఘమువార పోటీపరీక్షలో జయమొందిన విశ్వబ్రాహ్మణబాలికలకు వెండి బంగారుపతకములనొసగి ప్రోత్సహించుటకు గత మహాజనసభలలో తీర్మానించిరి. తీర్మానానుసారముగ బహుమానముల నిచ్చుచున్నారు. ఈబహుమానముల నింకను వృద్ధిపఱచవలయును. వివాహములయందును బాలికలకు బహుమానము లియ్యవలయును. వేయియుపన్యాసములకంటె నొకతీర్మానమును, వేయితీర్మానములకంటె నొకయాచరణయు, గుణకారిగానుండును. గావున స్త్రీవిద్యను సర్వవిధముల ప్రోత్సహింపుడు. ఇదియె నాప్రార్థన.

# సంసారపుస్త్రీలాభివృద్ధిసంఘము

## ఆంధ్రస్త్రీల బహుమతిపరీక్షలు

కృతార్థులైనవారికి గతసంవత్సరము 13 బంగారుపతకములు, 10 వెండిపతకములు, 100 రూపాయలపుస్తకములు పంచిపెట్టబడెను. హిందూస్త్రీలు జాతితోగాని, వయస్సుతోగాని నిమిత్తములేకయే పరీక్షకు రావచ్చును. తపాలాఫీసుయున్న ప్రతిగ్రామమును పరీక్షాస్థలముగా నుండును. కావలసినవారికి దరఖాస్తుపత్రములు డిశంబరునెలలో పంపబడును.

1916 ఏప్రెలులో జరుగు పరీక్షకు పఠనీయగ్రంథములు.

సాహిత్యము:—

1. పద్యకావ్యము; మొల్లరామాయణము, సుందరకాండము, వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండుసన్సువారిచే ప్రచురింపబడినది, వెల రూ 0-8-0 లు

2. వచనము a మహాభారతసారము; చతుర్థపంచమాశ్వాసములు (పద్యములుసహా) బందరు సేతుబదర్సువారిచే ప్రచురితము; వెల 0-12-0

b. విజయనగరసామ్రాజ్యము; విజ్ఞానచంద్రికామండలివారిచే ప్రకటింపబడినది. వెల 0-13-0లు.

3. వ్యాసముల్వ్రాయుట; పఠనీయగ్రంథములనుండియు, స్త్రీలకుపయోగించు వివిధవిషయముల గురించియు (గృహనిర్వాహకత్వము, పాతివ్రత్యము, శిశుపోషణమొదలైనవి) వ్యాసములువ్రాయుట.

గణితము;—గతసంవత్సరమువలెనే యేగణితపుస్తకమునైన యుపయోగించి సంఘమువారిచే నిర్ణయింపబడినవిషయములను నేర్చుకొనవలయును.

చరిత్ర లేక శాస్త్రము.
- మహమ్మదీయమహాయుగము; మూడవప్రకరణము విజ్ఞానచంద్రికామండలివారిచే ప్రచురితము. వెల 0-13-0
- జంతుశాస్త్రము. 0-9-0లు. కే. శ్రీరామయ్యగారిచేకృతము విజ్ఞానచంద్రికామండలివారిచే ప్రచురితము.

పైరెంటిలో నేదియైన నొకటిమాత్రమే చదువవలయును.

ఇంకనువివరము తెలిసికొనగోరువారు క్రిందసంతకముచేసినవారికి వ్రాయవలెను.

దిగుమర్తి కోదండరామస్వామి, బి. యే.,
అయ్యగారి సుబ్బారావు,
కార్యదర్శులు.

నర్సాపురం,
3—2—1915

# ఎదురుకోల సన్నాహము.

( నాల్గవరోజు రాత్రి పూరేగింపు మహోత్సవము జరిగిన తరువాత వధూవరులును వారివారి పక్షమువారును ఒకింత దూరముగా గూర్చునియుందురు. శివుని పక్షమున నందియును, పార్వతి పక్షమునం బురోహితులును ముందుకువచ్చి ఇట్లు ప్రసంగించిరి. )

పురోహితుఁడు—ఎవరుమీరు? తోక కొమ్ములు జూడ పశువులాగున నున్నారే

నంది—కొండమనుష్యులకు నాగరికలక్షణములు తెలియవు కాబోలును. తారతమ్యము విచారించక మాటాడవచ్చునా? మీ ఛాందస మెక్కడికి పోవును!

పురో—క్షమింపుడు. నవనాగరికులకు తోక కొమ్ములుండు సనుట మరచితిని. అయితే మీవృత్తాంత మేమి?

నంది—మాది కైలాసపర్వతము. నే నీశ్వరుని సేవకుడను. నాపేరు నంది మాఈశ్వరునకు కన్యగావలసియున్నది. మీపార్వతి మా ఈశ్వరునకు తగినకన్యయని వినివచ్చినారము.

పురో—మాపార్వతి మహాసుగుణవతి, విద్యావతి, సుకుమారి. బిచ్చమెత్తుకు నిజీవించు జంగముదేవర లామెకు తగియుండునా?

నంది—ఏమేమి? బిచ్చగాడా? ఈశ్వరుని గొప్పతనము మీకు తెలియదు కాబోలును.

పురో—తెలియకేమి? బట్టలు లేక చర్మము గట్టుకొనుట, బూడిద పూసికొనుట, పాముల నాభరణములుగా ధరించుట. ఇల్లువాకిలి లేక స్మశానవాటికలో బరుండుట, భుజించుటకు కంచమైనను లేక పుర్రెలో భుజించుట, మున్నగునవి గొప్పలక్షణములేనా? ఇట్టి గర్భదారిద్ర్యముగలవానికి కన్య నిత్తురా?

నంది—మీయూహ సరిగాదు. మా యీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. మిగుల దేశాభిమాని. విదేశవస్తుబహిష్కారము చేయుచు గ్లాస్కోమల్లులుగట్టు నవనాగరికుఁడు గాఁడు. నారచీరెలు, గజచర్మము, మున్నగునవి ధరించుట దారిద్ర్యమువలనఁ గాదు. మహదైశ్వర్యవంతులు. వెండికొండగలదు. వారికి విషజంతువులుకూడ స్వాధీనమైయుండునని తెలుపుటకు పాములధరించియున్నాఁడు. మిగుల దయగలవాఁడు. ఇదిగాక మీ కన్యకు ఈతఁడు జోడగువాఁడు.

పురో—అయితే కొంచెముకదలిరండు. నిజముగా ఐశ్వర్యమునకు, వెండికొండకు సంతసించువారము కాము. వరునియొక్క సుగుణములు మా కన్యయొక్క యోగ్యతకు తగియుండునని సంతసించెదము. అయితే మీ ఈశ్వరునకు అంగవైకల్యముగలదట, అందులకేమి చెప్పెదవు.

నంది—అంగవైకల్యమా! ఎంతమాత్రమును లేదే. అతఁడు మిగుల సుందరుఁడు. ధవళాంగుడు.

పురో—అందరివలెగాక ఫాలమున నొకనేత్రముండునట 'నీమొహానగ్రద్దమొలవా' అనితిట్టినటుల నుండుట అంగవైకల్యము కాదా?

నంది—కాదు కాదు. అది జ్ఞాననేత్రము. మీకు బాగుగా తెలియకున్నను మీపార్వతిగూడఁ గిరియే ఈశ్వరునిగూర్చి తపస్సుచేయుచున్నది. కావున మీరేకదలిరండు.

పురో—ఔను మాకిదియేముఖ్యము. మా పార్వతి ఈశ్వరునిగూర్చి తపస్సుచేయుచున్నదనుట స్వయంవరమని తెలియుచున్నది. అష్టవిధవివాహములలో బ్రాహ్మవివాహము ఉత్తమమని చెప్పియు, మాటలచేతను, చూపులచేతను, మనసుచేతను, పరస్పరమాకర్షింపఁబడువారికి వివాహముచేయుట మేలని ఋషులు చెప్పియున్నారు. కావున మీరు కదలిరావచ్చును.

నంది—మాకేమి మర్యాదలు జరుగగలవు.

పురో—మర్యాదలకేమియును లోపముండదు కాని, కొన్ని షరతులు గలవు

దానికి సమ్మతించినయెడల మీరు మాకన్యకొరకు రావచ్చును.

నంది—ఆషరతు లేమి?

పురో—శుల్కమడుగుటయు, భోగముమేళమునుతీసుకొనివచ్చుటయు తగదు.

నంది—అది మేమును నిషేధించినవే.

పురో—తాముకర్చుచేయుట కష్టము. కాని పుచ్చుకొనుటలో కష్టము లేదుగదా? భోగముమేళమును నిషేధించిరేమో శుల్కమడుగకుందురా?

నంది—మేమిప్పుడొకమాటయు, తరువాత వేఱొకమాటయు నుడువువారము కాము.

పురో—మీమాటల నెవరునమ్మెదరు? మీరు వచ్చిగడ్డిఫలహారము చేయువారు మీయజమానులు మత్తుపదార్థముల నుపయోగించెడివారు. నేననేక వివాహములు చూచియున్నాను. మొట్టమొదట శుల్కము కక్కర లేదని చెప్పుచు, తరువాత అలుకసమయమందు కదలిరమ్మనగా సాగిసాగి కట్నము రెండునవరసులుగాని వెండిచెంబుగాని ఇయ్యవలసినదని పీడించుట తుదకు, మీరేమియు నియ్యకున్నచో మామిత్రులలో పరువుగానుండదని దేవురించుటయు, చూచియున్నాను.

నంది—(చెవులు నిక్కబొడిచి. గ్రుడ్లెఱ్ఱజేసి కాలుదువ్వి) ఏమీ మేమట్టివారము కామే.

పురో—(బుడ్డిచెంబు చేతబుచ్చుకొని కొంచెము వెనుకకునడచినిలచి) సంతోషమె. కాని ఈశ్వరునివిషయమై ఇంకొకసంశయముగలదు.

నంది—అదియేమి?

పురో—మీఈశ్వరుఁడు మౌని. ఐకమత్యమెరుగనివాఁడు. గంగ మానెత్తిమీదనున్నది. ఒరుల యాహారపానీయములతో మాకు పనిలేదని పెట్టుపెట్టుకని మాశీలమే యోగ్యమైనదని తలచుచుండునట. బంధుమిత్రుల నందరిని సమముగా ప్రేమించుట, సమముగాగౌరవించుట మాయాచా

రము. సంబంధము చేసినపిమ్మట, అది మాశీలము, ఇది మాయాచార ము అను భేద మెంతమాత్రమును నుండగూడదు.

నంది—మనపూర్వులయులవాటు కొంచెము పెద్దవారియందుమాత్ర మున్నది. మన మెంతిచెప్పినను ఆతలలు తిరుగవు. వధువువారి కా నియమముల తోడ పని లేదు. ఈశ్వరునిమాట అటుండనిండు వారిపెద్దలు మాత్రము మాశీలం మాదేనని ఖండితంగా వుండేవారే. అదితప్పా. పూర్వ మీ మాదిరిగా వివాహములు జరుగ లేదా?

పురో—పూర్వులమాదిరిగా మీరు మీపెద్దలు నడచుచున్నారా? మీవన్ని దొంగమాటలు. వారికడ్డము పెద్దదని సంతసించికాబోలును కొందరమును లఇండ్లలోమీరుమీపెద్దలును కడుపారగుడిచియుండిరనుటమేమెరుగ మా నిజముచెప్పుచున్నాను. కోపించవలదు. మీరునందీశ్వరులు. పచ్చిగడ్డి వలహారముచేయువారు. మీమాటనిజమా. తరువాత భేదముతోడనే వర్తింతురేమో. అది మిగుల రోతగానుండును. ఆతీరున కొందరుబుద్ధిమంతులు చేసియున్నారు. ముందుగా వలయునన్నిషరతుల నడుగవచ్చును. తరువాత బుద్ధిజెప్పుటకు వీలుండదుగదా.

నంది—(కొంచెము తోకముడిచి) మీరుచెప్పినటుల వర్తింతుము. కన్యయొక్క యోగ్యతప్రధానముగాని ఇతరవిషయములతో మాకుపనిలేదు.

(అందరు మంగళవాద్యములతో కదలిపోదురు.)



# అన్నా ఈగలెంత అపాయకరములు!



ఇంగ్లాండుదేశమున వసంతఋతువునందు చాలమంది బిడ్డలు చచ్చుచుందురు. అక్కడ వేసవి మనదేశమందువలె మిక్కిలి వేడిగనుండదు. వడగాల్పులుండవు. దాహమునకై బాధపడి చచ్చువారుండరు. వేసవికాలము అక్కడివారికి హాయినిచ్చు ఋతువు. అయినను బిడ్డలు సంవత్సరమునకు దాదాపు 30, 000 వేలమంది తక్కిన ఋతువులలోకంటె ఎక్కువగా చచ్చుచున్నారు! ఆఋతువునం దొకవిధమగు బాలరోగము వృద్ధిగనుండును. ఈరోగము ఈగలవలన వ్యాపించుచున్నటుల గనుగొనబడినది.

అన్నా ఈగలు ప్రతిసంవత్సరమును ఒక్కఋతువులో ఒక్కదేశములో 30, 000 మందిబిడ్డలకు చావును గలిగించుచున్నవి! సామాన్యములగు ఈ ఈగలెంత అపాయకరములు! వీనినిజంపుట కనేకయుపాయములు ఆదేశమున గనుగొనబడినవి. ఆయుపాయములు చాలుటలేదు.

ప్రతి ఆడుఈగయు నొక్కొక్కసారి 120 గ్రుడ్లుపెట్టును. వసంతఋతువునందనేకసారు లది గ్రుడ్లుపెట్టును. అన్నియు నెన్నిగ్రుడ్లగునో లెక్కవేయుట కష్టము! ఈగ క్రుళ్లిపడియున్న ఆకు అలములందును, క్రుళ్లుచున్న జంతువుల శరీరములందును, పెంటకుప్పలందును, మురుగుడుగోతుల దాపునను, మురుగుడునీళ్ల దాపునను గ్రుడ్లుపెట్టును. రెండుమూడు గంటలలోనె యాగ్రుడ్లు పురుగులగును. ఈపురుగులు మురుగుడుపదార్థములనుదిని త్వరగా పెరుగును. సుమారు పదిదినములలో ఈపురుగులు ఈగలుగ మారును. ఈ ఈగలు ఎల్లెడల నెగురసాగును. ఈగలకు క్రుళ్లుడుపదార్థములు మాగిపోయిన పండ్లు, మనము తినువస్తువులు నన్నియు ఆహారములే!

అనేకములగు రోగములకు మూలములగు సూక్ష్మజీవులను (అనగా కంటితోచూచుటకు శక్యముగానంత చాల చిన్నపురుగులను) ఈగలు తినును

ఇటుల నవితినుటయేగాక, ఆపురుగులు వానినోళ్లలోను, కాళ్లమీదను, శరీరములమీదను అంటుకొనగా వాని నితరచోట్లకు గొనిపోవును. మన ఆహారపదార్థములమీదను, పిల్లల కురుపులమీదను ఈగ వ్రాలునప్పుడు దానితోవచ్చిన సూక్ష్మజీవులు మనయొద్దకు జేరుచుండును. ఇటుల కండ్లకలక చీడ, విషజ్వరములు, మశూచకము, కలరా, నారికురుపులు, బొబ్బల రోగములును వ్యాపించును. ఈగలు వ్రాలిన అన్నమునుగాని, పంచదారనుగాని, బెల్లమునుగాని, మిఠాయిలనుగాని, తినరాదు.

ఈగలు గట్టివస్తువులను దినవు. అవి పంచదార మొదలగువానిపై వ్రాలునప్పుడు వానితొండమువంటినోళ్లనుండి ఉమ్మివేసి, ఆఉమ్మితో కలిసి పానకముగనైన ద్రవమును పీల్చుకొనును. ఈగలు వ్రాలుపదార్థములను వెంటనే కనిపెట్టిచూచినయెడల వాని యుమ్మినీటిబొట్లు మనకుగాన్పించును. నానావిధములగు పురుగులతో నిండిన వానియుమ్మి మనముతిను పదార్థములను అసహ్యముగజేయును. రోగములనుదెచ్చు వస్తువులనుగ జేయును. ఈసంగతి తెలియక మనము ఈగలనుదోలుకొని వానియుమ్మితో నసహ్యమగు పదార్థములను దినుచున్నాము. చిన్నబిడ్డలీవిషయమున జాగ్రత్తగ నుండవలయును. కురుపులమీద నీగల వ్రాలనీయరాదు. తినుబండారములమీద నీగల వ్రాలనీయరాదు. ఈగలనే దరి రానీయరాదు. ఈ పైకారణముల చేతనే ఇంగ్లాండులో సంవత్సరమునకు 30,000 మంది బిడ్డలు చచ్చుచున్నారు.

దుర్వాసనవచ్చుచోట్లు, ముఱుగుడువస్తువు లుండుచోట్లు, తేమచోట్లు మనయిండ్లకును ఆడుకొనుచోట్లకును దాపునలేనియెడల ఈగలు గ్రుడ్లుపెట్టు తావులు మనకు దూరమగును. వానిబాధ మనకు తప్పును. నూతులయొద్ద, చెఱువులయొద్ద, పశువులదొడ్లయొద్ద, ఇండ్లతూములలో, వంటయిండ్లయొద్ద, గదులమూలలందు నీగలు గ్రుడ్లుపెట్టును. వానిని ఎల్లప్పుడు శుభ్రముచేయుచుండవలెను.

# ఏడుబంగారుకుండల కథ.

———:o:———

అనగనగ నొకమంగలి యొకచెట్టుదాపుగా బోవుచుండె. ఆ చెట్టునందొక భూత మావేశించియున్నది. అత డట్లుపోవుచుండగా "ఓయీ! నీవు యేడుబంగారుకుండలు కావలయునా?" యని భూతము వాని నడిగెను. అంత నతడు చుట్టును జూచి యెవరిని గానక భీతిలసాగెను. వాని కాచెట్టునుండి యాధ్వని మరల మరల వినబడుచునే యున్నది.

వానికి భయముతగ్గుచు వచ్చినది. ఏదేవతయో తన ననుగ్రహించినదని వాడనుకొనెను. వానికి కనకకాంక్ష హెచ్చినది. నడుమనడుమ "ఈగొడవ నాకేల? నాకింతధనమెందుకు? అత్యాశపడిన నేమిమూడునో!" యని వాడు సందియ మందెను. కాని వానియాశ తుదకు వాని లోబఱచుకొనినది.

"దేవుడే నన్ననుగ్రహించి నా దారిద్ర్యమును బాపి కరుణజూపనుండ నేను వలదన నేల? ధనకుంభములు గావలయునా యనియడుగవలయునా? దయచేయుము!" అనిమంగలిపలికెను.

"మంచిది. వానిని నీయింటికి జేర్చితిని" అని ప్రత్యుత్తరము వచ్చెను.

అంతట మంగలి కడువేగముతో రొజుచు నింటికి బర్వెడిపోయెను. ఏడు బంగారుకుండలును వానిగృహమున నున్నవి. కడుతత్తరముతో వాడా భాండములు తెఱచిచూచెను. ఆరుకుండలు బంగారునాణెములతో నిండియుండెను. ఏడవది సగముమాత్రము నిండియున్నది. దానినిగూడ నిండింపవలయుననుఆశ వాని నలముకొనినది.

దానిని నిండింపవలయునను ఆశ సర్వకాలములందును సర్వావస్థలయందును వాని బాధింపసాగెను. కావున వాడు తనపొలమును పశువులను

నమ్మి యాధనమును భాండములో వేసినాడు. చాలలేదు. భార్యా బిడ్డల నగలన్నింటి నమ్మి యాసొమ్మును దానిలో వేసినాడు. చాలలేదు.

తాను కడుపునిండదినక తనకుటుంబమువారిని గడుపునిండ దిననీయక ధనమునుగూర్ప మొదలిడినాడు. తానుకొలుచురాజును వేడికొని జీతమును వృద్ధిచేయించుకొనినాడు. బిచ్చమెత్తుట కారంభించినాడు. ఎన్నిచేసినను నేడవకుండ నిండదయ్యెను. అంత నతడు ఖిన్నుడై తిండిమాని సంకటపడుచుండెను.

ఒకనాడు రాజు వానిదుస్థితిగనిపెట్టి " ఏమిరా! నీ విప్పటిజీతమున సగమువచ్చుదినములలో సంతోషినైయుంటివి, ఇప్పుడు తిరిపెమునకుగూడ బయలుదేఱితివి! యక్షుని వరాలకుండల బుచ్చుకొంటివా యేమి? " అనియడిగెను.

" అవును. మహాప్రభూ! " అని తనసంగతినెల్ల వివరించిచెప్పి యామర్మము రాజున కెట్లుతెలిసెనని యడిగెను.

రాజంతట " నీ దుస్థితిని గనిపెట్టి నేను నందియమందితిని. నా సంశయము తెల్లమైనది. ఆ యక్షునికుండల దీసికొనినవానికి సౌఖ్యముండదు. ఆశాపిశాచము బలముగ బట్టుకొనును. వాని దుఃఖములకు మేర యుండదు.

" కావున దత్క్షణమే వానిని దీసికొనిపోయి యక్షునిచెట్టునొద్ద బాఱవేసి రమ్ము " అని బోధించెను.

మంగలి తెలివితెచ్చుకొని, రాజుమాటలు తన యనుభవమునకు సరిగనుంట నెఱింగి వరాలకుండలను దీసికొనిపోయి చెట్టునొద్ద బాఱవేసి " ఓ యక్షా! నీకుండలు నాకు వలదు. నీవ దీసికొమ్ము " ని తిరిగిచూడక యింటికివచ్చెను.

అంతటితోడ వానితృష్ణ యడగినది. అత డెప్పటియట్ల తనమాత్రము సంపాదనతో దృప్తుడై సుఖజీవనము చేయుచుండెను.

మనమెల్లరమును నేడవకుండను వరాలతో నింపనెందువారివలె, మన్న దాని ననుభవించి, పాటుపడి సంపాదించినదానితో దృప్తినంది తగుమాత్రపు వసతితో సంతోషముననుండక యత్యాశలకుబోయి లేనిసంకటముల దెచ్చిపెట్టుకొనుచుందుము. తృప్తికిమించిన సౌఖ్యమును తృష్ణకుమించిన దుఃఖమును లేదు.

---

# హైకోర్టు జడ్జి.

## ఆంధ్రుఁడే కావలెను.

శంకరునాయరుగారు ఇండియాదొరతనమువారి కార్యనిర్వాహక సంఘసభ్యులుగా నియమింపఁబడినపిమ్మట ఆపదవి ఖాళీగా నుండెననుట సుప్రసిద్ధమేగదా? ఒకకథలో. రాజ్యాధిపత్యమును వహించుటకుదగినవారి నేర్పఱచుటకై విడువబడిన పట్టపుటేనుగు కర్ణముగా, మురుగు లుంగ్రాలవారు, పోగులవారు, తట్టతలపాగాలవారు, తగినవాఁడను నేనునే నను మీదు మీదుకు వచ్చెదరన్నటుల, ఆంగ్లేయులు తమకుగావలెననియు, పెద్దయుద్యోగులు, వకీళ్లు తమకు తమకనియు, అరవవారు తమకేపదవి శాశ్వతహక్కుగా నుండవలెననియూ, ఆంధ్రు లీపని కడుగడగూడదనియు చెప్పుచున్నారు. వీరు అందఱికంటె బుద్ధిమంతులు. వీరికి రెండుచింతలు కలవు. తమకు లేదనుచింత. ఎదుటివారికి కలదనుచింత. ప్రతికార్యమునకును ప్రతి పదవికిని తమకుగల యర్హతను తెలుపుట యుక్తముగాని, ఆంధ్రు లచ్చోట నడుగిడరాదనుట అయుక్తము. అక్రమము. ఆంధ్రదేశ విశ్వబ్రాహ్మణులకు ఆచారిశబ్దముగోలకూడ నీయరవవారివలననే కలిగినది. ఇఁక ముందీఅరవగోల ఆంధ్రుల కడ్డమురాకుండుగాక.

నిజముగా నీపదవికి దగినవారు ఆంధ్రులుగాని ఇతరులు కానేరరు. దేశహితార్థమై ప్రతిసంఘమునందును ప్రతి మండలమునందును, ప్రతి రాజ్యమునందును సరియైన నాయకు లుండవలయును. ఉన్నతపదవిని వహించినవా రుండవలయును. దొరతనమువారికి తమ కష్టనిష్ఠురములను తెలుపుటకు రాజ్యాంగభాషలో వార్తాపత్రిక లుండవలయును. దొరతనమువారిది ఆంగ్లభాష. మనది ఆంధ్రభాష. ఆంగ్లభాషతోనుండు వార్తాపత్రికల వలన గాని, మన స్థితిగతులు దొరతనమువారికి నివేదింపఁబడవు. అట్టి పత్రికకు ఆంధ్రులే సంపాదకులుగా నుండవలయును. మన దేశమునందలి ప్రబలమగు ఆంగ్లపత్రికలకు ఆంగ్లేయులును, అరవవారును సంపాదకులుగా నున్నారు. అందువలన ఒకరివ్యాధినిగూర్చి మఱియొకరు వైద్యులకుఁ దెలిపినటుల నుండును. కావుననే దూరదృష్టిగల బుద్ధిమంతులు, ఆంధ్రరాష్ట్రము మధ్య ఆంగ్లభాషలో నొక దినపత్రిక యుండవలయుననియు, దానికి ఆంధ్రులే సంపాదకులుగా నుండవలయుననియు తీర్మానించియున్నారు. దాని యుపయోగ మెట్టిదో ఆంధ్రులలో నొకరు హైకోర్టు జడ్జిగా నుండుటవలన గలుగు ఫలముకూడ నట్టిదే. లేకున్న సుమారు రెండుకోట్లసంఖ్యగల ఆంధ్రులలో నొక్కరు హైకోర్టు జడ్జిగనుండిన నెవరికడుపునిండును? మనశరీరమునందలి లోగుట్టంతయు ముఖలక్షణములవలన బయల్పడగా వాక్కుచేత తెలుపఁబడును. ప్రత్యేకాంధ్రరాష్ట్రము కావలెనను భావ మిదియే. అందువలన నాంధ్రులందరును తమహక్కులను గ్రహించి తమయొక్క యభిప్రాయము నొక్కముఖమున వెలిబుచ్చగలరు. ఆంధ్రులకుదక్క తక్కినవారికి తమ వాంఛితములను దొరతనమువారికి దెలుపుమార్గములు లేకపోలేదు. వారు ఆంధ్రులను దిగువంద్రోసి, ఈపదవి తమకు తమకు అని ముందుకువచ్చుట స్వలాభేచ్ఛగాని దేశాభిమానలక్షణము గానేరదు. ఆంధ్రుల మొఱ వుయ్యాలలోని బిడ్డరోదనమువంటిది. దయగల ప్రభుత్వముదక్క నితరులు వీరికోరికను దీర్చువారు కారు. దొరతనమువారు బాగుగ విచారించి ఈపదవి ఆంధ్రులకొసఁగవలయును. అందువలన నాంధ్రులయొక్క స్థితిగతులను దొరతనము వారు తెలిసికొనఁగలరు.